# ఉపోద్ఘాతము

ఇటీవల నాధ్యాత్మిక కవిత్వము రవీంద్రనాథ ఠాకూరు గారితో కూడ ప్రాముఖ్యమునకు వచ్చినది. ఠాకూరు, మహాకవి గీతాంజలి ప్రకటించినాడు. ఆ గ్రంథము పాశ్చాత్యుల పొగడ్తలకు లోనయినది. దానివల్లనే ఠాకూరు కవి నోబెల్ బహుమానము సంపాదించి నాడు.

అంతటి ప్రతిష్ఠను గీతాంజలి సంపాదించుటచేత తెలుగులో కూడ కొన్ని ఆధ్యాత్మిక కవిత్వగ్రంథ ములు బయలుదేరినవి. కాని ఈగ్రంథములను గురించి విమర్శలు యింకను వెలువడలేదు. కాన వాటి మంచి చెడ్డలను గురించి మనమేమియు చెప్పజాలము.

గీతాంజలిలో ఠాకూరు మహాకవి భగవంతుని యందు తనకుగల ప్రేమ, భక్తి వెలిబుచ్చినాడు. ఆ గ్రంథములో దృశ్యములవంటివి అనేకములు వర్ణింప బడినవి. ఆదృశ్యముల వంటివి అన్నియు ఠాకూరు గారి భావనయే. అవి భావనయే గాని నిజముగావని తెల్పుటకు గీతాంజలియే సాక్ష్యము. ఠాకూరుగారు

తాము భగవంతుని సందర్శించియుండలేదని గీతాంజ లిలోనే స్పష్టముగా చెప్పియున్నారు. ఆ అంశమును తెలియజేయు భాగములు గీతాంజలి (ఆదిపూడి సోమ నాథరావుగారి యనువాదము) నుండి యుదహరించె దను.

నాకుఁ బరమావధివి గాననాథ ! నిన్నుఁ
గరము మెలఁకువ నొక్కమాఱరయుచుందు ;
మెలఁకువను దక్కియొకమాఱు మెలఁగుచుందుఁ ;
గాని నీవేలొకో దాఁగి కానరావు.

(౧౮ వ గీతము)

దేవ ! నిన్గాంచు భాగ్య మీ జీవితమున
నేను గనఁజాలనేని యో దీనరక్ష !
"తప్పితిని నీదు దృష్టికి దప్పితి" నని
యెప్పుడును నాదుమదిలోన నెంచనిమ్ము.
ఒక్కక్షణమైన మఱవక యుండ నిమ్ము.
స్వప్నజాగ్రదవస్థల స్వామి ! నేను
దారుణంబగు నీచింతఁ దాల్పనిమ్ము.

(౭౯ వ గీతము)

ఠాకూరుగారికి ఈశ్వరసాక్షాత్కారము లేదను టకుగాను తెలుపబడిన అంశములు అవి.

శ్రీ మండపాక పార్వతీశ్వరశాస్త్రిగారు 'పాలవెల్లి,' 'తేనెపట్టు' అను రెండు ఖండకావ్యసంపుటములు ఈ మధ్య ప్రకటించినారు. ఈ సంపుటములు చదువు భాగ్యము నాకు గలిగినది. కవిగారిని కావ్యముల ద్వారా యెరిగినాను. వారి కవిత్వమును చదివి ఆనందించి వాటిపై నొక పెద్దవిమర్శ వ్రాసి 'ఉషస్సు' పత్రికలో ప్రకటించినాను. ఆ వ్యాసమును కవిగారుకూడ చూడ తటస్థించినది. వారు ఆ విమర్శను మెచ్చుకొన్నారు. అట్లు మెచ్చుకొనుటకు కారణము ఆ విమర్శలోని గుణముగాక వారి ఔదార్యమనియే నేను తలచుచున్నాను.

శ్రీ పార్వతీశ్వరశాస్త్రిగారు తమ రెండుగ్రంథములలోను ఆధ్యాత్మిక కవిత్వము రచించినారు. ఠాకూరుగారుకూడ గీతాంజలిలో ఆధ్యాత్మిక కవిత్వమే రచించినారని అందరు ఎరిగిన సంగతే. కాని శ్రీ పార్వతీశ్వరశాస్త్రిగారి ఆధ్యాత్మిక కవిత్వము ఠాకూరుగారి ఆధ్యాత్మిక కవిత్వముకంటె భిన్నము. ఠాకూరుగారు

తమ గ్రంథములో తాము జూడనటువంటి భగవంతుని పై తమకు గల ప్రేమ, భక్తి వర్ణించినారు. పార్వతీశ్వరశాస్త్రిగారో ! వారు భగవంతుని మాతృరూపమున గొల్చి సాక్షాత్కరింపజేసికొని, అద్వైతసిద్ధిని పొంది, సమాధిదశలలో తమకు కలిగిన దృశ్యములలో కొన్నిటిని తమ కావ్యములలో వర్ణించినారు. కవిగారు ఆదృశ్యములతో బాటు తమ జీవితమందలి కొన్ని దశలను కూడ వర్ణించినారు.

శ్రీ పార్వతీశ్వరశాస్త్రిగారు మానవుడు పొందవలసిన ఉత్తమస్థితిని అనగా ఈశ్వరసాక్షాత్కారమును పొందినారు. అట్టిస్థానమును పొందినవారు ఈ ప్రపంచములో చాల అరుదు. ఆ పొందిన కొద్దిమందిలోను తమ అనుభవములను ఇతరులకు జెప్పెడివారు మిక్కిలి తక్కువ. ఆ చెప్పెడివారిలోనైన కవులు బొత్తిగా తక్కువ. భారతదేశముయొక్క అదృష్టమువల్ల శ్రీ పార్వతీశ్వరశాస్త్రిగారు ఒక్క ఋషులేగాక మహాకవులు కూడా. వారు భగవంతునితో తమకు కలిగిన అనుభవములను అద్భుతమైన కవిత్వములో మనకు తెలియజేసినారు.

శ్రీ మండపాక పార్వతీశ్వరశాస్త్రిగారు * 'విరిసెజ్జ' అను ఈ గ్రంథమును ప్రకటించుచున్నారు. ఈ గ్రంథ కూడ పై రెండిటివలెనే ఆధ్యాత్మిక కవిత్వముగలది. ఇదికూడ వాటివలె ఉత్తమమైన గ్రంథము.

విరిసెజ్జలో నైదు ఖండకావ్యములున్నవి. రెండవ ఖండకావ్యములో కవిగారు భార్యయొక్క మరణము, కష్టములు, రెండవవివాహము గురించి వ్రాసినారు. మూడవ ఖండకావ్యములో భౌతికస్థానాపేక్ష, ఈశ్వరీ దర్శనము గురించి చెప్పినారు. నాల్గవదానిలో సమాధిలోని దృశ్యము, అయిదవదానిలో భౌతికస్థానాపేక్ష, కష్టములు, ఈశ్వరీదర్శనము పరిగ్రంచినారు. (ఈఖండ కావ్యములలో 'అమ్మ,' 'ఆత్మేశ్వరి' అను పదములకు 'ఈశ్వరి' అని అర్థము చేసికొనవలెను.)

శ్రీ శాస్త్రిగారి కవిత్వము బహురసవంతమయినది. భాష బహుసులభము. ఎంత గొప్పభావము నయినను వారు బాలునికయిన నర్థమగునట్లు బహుసులభమయిన భాషలో బహురసవంతముగ చెప్పగలరు. వారినుండి ఈ గుణమును ఈ నాటి తెలుగుకవులు

* విరిసెజ్జలో కొంతభాగము 'భారతి' లో మొదట ప్రకటింపబడినది.

నేర్చికొనవలసి యున్నది. అట్లు నేర్చికొని తెలుగుకవిత్వములోని 'తెలుగు' అను మాటను నిలబెట్టవలసి యున్నది.

ఈ కాలపు కవిత్వములో సాధారణముగ తేటగీత లక్షణము ఉపయోగింపబడుచుండును. కాని పార్వతీశ్వరశాస్త్రిగారు తమరచనలలో మంజరీద్విపద లక్షణమును వాడియున్నారు. ఈ లక్షణము వీరికవిత్వమున కెంతయు సరిపోయినది. కవిగారి ప్రకృతివర్ణనలలో నొక ప్రత్యేకగుణమున్నది. వీరు ప్రకృతికి మనుష్యచైతన్య మారోపించి వర్ణింతురు. అద్వైతసిద్ధి పొందిన వీరికి జగత్తు అంతయు సచేతనముగ నుండుట సహజమే.

మండపాకకవిగారి కవిత్వములో ధ్వని విశేషముగ నుండును. కవిగారి జీవితచరిత్ర పూర్తిగ తెలిసినగాని వారి రచనలలో కొన్ని భాగములు మనకు సంపూర్ణముగ అర్థముకావు. శ్రీ శాస్త్రిగారు తమ జీవితచరిత్రను త్వరలో ప్రకటించెదరని తలచుచున్నాను.

ఈ కవిగారి గ్రంథములలో మనకొక చిన్న విచిత్రము కనబడుచుండును. ఈయన తాను వెనుక ప్రక

టించిన ఖండకావ్యములనే తిరిగి తన గ్రంథములలో ప్రకటించుచుండును. 'విరిసెజ్జ' లోని రెండవ ఖండ కావ్యము తేనెపట్టులో మొదట ప్రకటింపబడినది. 'అలసిపోయితిని' అనుపాట పాలవెల్లిలోను, తేనెపట్టు లోను ప్రకటింపబడినది. అయిదవ ఖండకావ్యములో తేనెపట్టులో ప్రకటింపబడిన 'చీకటి' అను ఖండ కావ్యము ఉపయోగింపబడినది. వీరి గ్రంథములలో ఇదొక విచిత్రము.

శ్రీ పార్వతీశ్వరశాస్త్రిగారి గ్రంథములను ఐహిక ములగు మరికొన్ని గ్రంథములతో సరిపోల్చకూడదు. ఒకవేళ సరదాకు ఏ గీతాంజలితోనో సరిపోల్చితిమో ఆ గ్రంథముకంటె వీరి గ్రంథములు ఎన్నివందల లేక ఎన్నివేల రెట్లు ఎక్కువో మనము నిర్ణయింపలేము. కనుక వీరిగ్రంథములను ఐహికములగు ఇతరగ్రంథము లతో సరిపోల్చకూడదు అన్నాను.

శ్రీ శాస్త్రిగారి ఆధ్యాత్మికభావములను గురించి మనము వేరుగ చెప్పలేము. వారి భావములు కేవ లము స్వకీయములు.

'పరమేశుప్రేమ స్వభావమెట్టిదియో
అనుభవించినవాడె సాక్షి దీనికిని'.

శ్రీ మండపాక పార్వతీశ్వరశాస్త్రిగారి కవిత్వము నానందించు భాగ్యము ఒక్క తెలుగువారికే గలదు. కాని వారి భావములను ఆనందించు భాగ్యము భారతీయుల కందరికిని కలదు. భారతీయులు వీరి గ్రంథములను చదివి అభివృద్ధి చెందెదరుగాక యని కోరుచున్నాను.

రాజమహేంద్రవరము, 30—1—1935 } టేకుమళ్ల కామేశ్వరరావు



సత్యానందనాథస్వామి

*

Come, live with me and be my Love.
*   *   I will make thee bed of roses.

*Marlowe.*

శ్రీ సత్యానందనాథుల పాదపద్మముల
సన్నిధిని

To you! to you! all song of praise is due
Only in you my song begins and endeth.

*Sidney.*

*

*

Befriend me, Night, best Patroness of Grief!
Over the pole thy thickest mantle throw,
And work my flattered fancy to belief
That Heaven and Earth are coloured with my woe;
My sorrows are too dark for day to know:
The leaves should all be black whereon I write,
And letters, where my tears have washed.
a wannish white.

*Milton.*

*

*

చ. ఖలుఁ డిలఁ దప్పులే వెదకుఁ గావ్యరసానుభవంబుఁ జేయలేఁ
డొలుకులుఁ గోరుఁ గాక, ముదమూనఁగ గర్ధభ మొంద నేర్చునే
మలయమరుద్విధూత మధుమాసవికస్వర కేసరావళీ
కలితపరాగయోగ పరికల్పితపేశల తల్పసౌఖ్యమున్ !

క. ఎల్లరు మెచ్చని మత్కృతి
నుల్లంబున మెచ్చుఁగాత యొకఁ డుష్ట్రికులం
బొల్లని పల్లవితామ్రము
కొల్లలుగాఁ బొగడ నొక్కకోయిల లేదే !

రసాయనము

*

# విరిసెజ్జ

## i

విరిసెజ్జఁ జూచి నివ్వెఱఁ బొందనేల ?

*  *  *  *  *

నా వలపుల పంట నా నోముఫలము
నా ముద్దులకొటారు, నా మోహనాంగి
నాదు ప్రేయసి వచ్చి, ననుఁగరంగించి,
మెల్ల మెల్లఁగఁ జెంత మెలఁగిన వేళ
విరిసెజ్జఁజేరి, యబ్బురపాటు తోడ,
ననునయాలాపంబు లన్యోన్య మొప్ప,
నా త్మేశ్వరియునేను నంతంబులేని
యానంతవార్ధి మున్గాడుచుండెదము.

*  *  *  *  *

ఆనందమునఁ దేలియాడుచుండెదము.

*  *  *  *  *

ఏనెఱుంగుదును నా యింతిచిత్తంబు,
నాదుచిత్తంబును నాయింతియెఱుఁగు;
ఇంతియు నేనును నేకచిత్తమున

# విరిసెజ్జ

విరిసెజ్జపైనిల్చి వేడ్కలందెదము.

*      *      *      *      *

*      *      *      *      *

ననుఁజూచి లోక మేమనుకొన్న నేమి!
నాకేల యాచింక? నాపనినాది.
లోకంపు సేవయే నాకుఁబ్రియంబు,
లోకంపు సేమంబె నాకునిష్టంబు,
తలఁచెద లోకమంగళము నెల్లపుడు.
కాని, లోకపుమెప్పుఁ గాంక్షింపఁబోను.
నను మెచ్చి లోకంబు నను గౌరవించు
ననుచుఁజిత్తమునందు నరయనే వేళ.
నాయింతితోఁగూడి నాయిచ్చమీఱ
విరిసెజ్జపై నిల్చి ప్రేమతోలాడ
నేనుముచ్చటలాడి నెనరొందువేళ,
నాయూసు తెలుపక, ననుఁజూచి నగక,
తన యుపేక్షయె నాకుఁ దగినకట్నముగఁ
దలఁచి యూరకయుండుతలఁపె చాల్నాకు.

*      *      *      *      *

విరిసెజ్జఁజూచి నివ్వెఱఁబొందవద్దు.

## ఏ రి సె జ్జ

## ii

Ask and it shall be given you;
Seek and you shall find;
Knock and it shall be opened unto you,
For, everyone that asketh receiveth,
And he that seeketh findeth; and to
Him that knocketh it shall be opened.

*The Holy Bible.*

అమ్మ చెప్పినమాట యాలకించితిని.

*　　*　　*　　*　　*

మాయమ్మ నాకొక్క మాణిక్యమిచ్చె,
మాణిక్యమును జూచి మదిఁబొంగినాను.
దినమున కొక క్రొత్త తీరుగాఁదోఁచి,
మదికి నుత్సాహంబు మాణిక్యమొసఁగె.
ముద్దులు గుఱియుచు, మురిపెంబుఁగొనుచుఁ;
జెలిమి మాణిక్యంబు సేయుచునుండె;
తళుకుఁదళుక్కను తను కాంతితోడ

మురిసి మాణిక్యంబు మోదంబొసంగె.

*        *        *        *        *

*        *        *        *        *

నిలిచినఁ గూర్చున్న నిదురవోయినను,
జెలులతో ముచ్చటల్ పలుకుచుండినను,
ఏకాంతమున నుండి యీశ్వరింగొలిచి,
ధ్యానించుచున్నను, ప్రార్థించుచున్న,
నేమితలంచిన, నేమిచేసినను,
నాదు మాణిక్యంబు నాచెంతనుండె,
చెంతనుండి ముదంబుచిందించుచుండె.

*        *        *        *        *

చనుచుండె నీరీతి దినములు నెలలు,
నెలలును నేండ్లును నిలువక చనియె;
ఆనందమునఁ దన్మయంబయ్యెమనము,
ఎన్నియేండ్లయ్యెనో యెఱుఁగను నేను,
అంతయు నొకదినమ్మైనట్లు తోఁచె.
తన్మయంబైనచిత్తముతోడ నెపుడు
నేనుమాణిక్యంబు నెటఁగూడియుంటి
మితరచింతలుమాని యేకభావమున.
ఆటలఁ బాటల నానందమిచ్చి

నాకు మాణిక్యంబు ననఁపులు గఱపె.
చెంత మాణిక్యంబు చేరియున్నపుడు
శ్రోత్రభావంబులు గుఱియుచునుండి
నాకవిత్వంబు విన్నాణంబునొందె.
మాణిక్యమును నేను మలసియీరీతి
దినములు సాగించుకొనియుంటిమి—

* * * * * ఐన

అకట—ఏమందు—అన్యాయ మన్యాయము—
ఏవేళకేమౌనో యెవ్వాఁడెఱుంగు?
కాలమెల్లపు డొక్కగతి నుండఁబోదు.

* * * * *

మాణిక్యమొకనాఁడు మఱిమఱి వెలిఁగి,
యెన్నశక్యముకాని హృత్ప్రీతినొసఁగె;
మఱచితి లోకంబు, మఱచితి వేళ,
నను నేనె మఱచి యానందమైయుంటి;
ఆడితి మాణిక్య మఱచేతఁ దాల్చి,
ఎగురవైచితి దాని నెగసిపట్టితిని;
ఎగురవైచుచు దాని నెగసిపట్టుచును,
నాటాడసాగితి నద్దానిఁగూడి;
ఎగయుచు, దిగుచును, నెగయుచు మరల,

నాడించినట్టులే యాటలాడుచును,
మదికి మాణిక్యంబు ముదమిచ్చుచుండె,
ముదమునఁ బొదలుచు మదినిద్రవోయె,
మాణిక్యమేడనో మాయమైపోయె!

*    *    *    *    *

*    *    *    *    *

*    *    *    *    *

తెలివివచ్చెను——చుట్టుఁ దేరిచూచితిని——
లేదు మాణిక్యంబు లేదఱచేత——
అఱచేతి మాణిక్య మక్కటా, పోయె!
ఈవలఁగంటి, నే నావలఁగంటి,
నేవలఁగన్నను నేమిలాభంబు?
లేదుమాణిక్యంబు లేదేడఁగూడ,
మాణిక్యమేమయ్యె?——

*    *    *    మఱికనంబడదు.

పోయెమాణిక్యంబు, పోయెనయ్యయ్యొ,
అయ్యయో మాణిక్య మదిపోయెనెటకో!
కలయయ్యె మాణిక్య మలయికకలిగె,
నలయిక తోడ నేనఱవసాగితిని,
అఱచితి——వెఱచితి——పఱచితి——మఱల

నఱచితి—వెఱచితి—పఱచితి—కాని,

మాణిక్య మొకసారి మఱి కంటఁబడదు.

*     *     *     *     *

*     *     *     *     *

అమ్మరో మాణిక్య మదపోయెనమ్మ
ఎయ్యెడఁబోయెనో యెఱుఁగనోయమ్మ
ఏమి చేసెదనమ్మ యేమినాకర్మ
మేగతిగలదమ్మ, ఏమిచెప్పెదవు?
నాకర్మ మేమమ్మ నాగతియేమి?
అనుచు నేడ్చుచుఁబోయి, యమ్మపాదముల
నశ్రులఁదడుపుచు, నఱచుచునుండ,
నఱచేత మాయమ్మ యంటె నాశిరము;
ఆఱచేత శిరమంటె, యాశీర్వదించి,
యమ్మ యిమ్మెయిఁ బల్కె ననునయించుచును;
పోయెఁ బోయె నటంచుఁ బొక్కుచు నిట్టు
లఱచిన మాణిక్యమబ్బునే మఱల?
వెదకుము, మఱిమఱి వెదకుము తండ్రి,
వేఱొక్కపనిమాని వెదకుముదానిఁ,
పౌరుషంబునఁ గాని పనులునుగలవె?
వెదకి కన్గొనుటే వివేకంపుఁదెఱవు;

వెదకుము—చూడుము—వెదకికన్గొనుము,
నాముద్దుఁగుఱ్ఱ, మనశ్శాంతి నీకుఁ
గలుగును, వెదకుము -తలఁకొంచవద్దు—

* * * * *

అమ్మ యిమ్మాశ్కి నా కాజ్ఞయొసంగ,
నమ్మయాజ్ఞను శిరంబునందుఁదాల్చితిని,
వేఱొక్కపనినూని వెదకసాగితిని.

* * * * *

* * * * *

వెదకితి, వెదకితి, విసిగిపోయితిని,
కాని మాణిక్యంబు కానరాకుండె,
పిచ్చి యెత్తినయట్లు వెదకసాగితిని,
పిచ్చి పట్టినరీతిఁ బిలువసాగితిని ;
పలుకరింపఁగలేదు, పలుకాడలేదు,
మాణిక్య మొకసారిమాటాడలేదు ;
పలుకాడలేదు, చూపట్టఁగాలేదు ;
ఇంక నా మాణిక్యమేడఁ గన్పట్టు !
పిచ్చియెత్తినరీతిఁ బిలువసాగితిని ;
ఇలువీడి దవ్వుగా నేఁగసాగితిని ;
ఎటుపోవుచుంటినో యెఱుఁగను నేను,

పోవుచునుంటిని బోవుచునుంటి.

* * * * *

* * * * *

* * * * *

చీఁకటి యంతటఁ జిక్కనై యుండెఁ,
దోవ కన్పడకుండెఁ ద్రోవఁబాటయ్యె ;
ఆకసంబునఁ దేరి యరయసాగితిని,
కోటిమాణిక్యాలు కూడికన్పడియె ;
కోటిమాణిక్యాలు కూడినన్నైన
నాదు మాణిక్యంపు మోడవిరాఁగలవె ?
లేదు మనశ్శాంతి, లేదు సంతృప్తి,
నాదు మాణిక్యంబు నాకుఁగన్పడదు !

* * * * *

* * * * *

కుంచాలతో మంచు కురియుచునుండె,
వలిగాలి వడవడ వడకించుచుండె,
చలియును మంచును దెలియరావయ్యె ;
మాణిక్యమును జూడ మదికోరుచుండె ;

* * * * *

పోయితి—పోయితి—పోయితినెటకో,

పోవుచునుంటిని—త్రోవ తప్పితిని—
దవ్వయ్యె మాయిల్లు—దవ్వుదవ్వయ్యె—
చలిబాధ మెండయ్యె, నిలువెల్లఁ దడిసెఁ,
గాని, మాణిక్యంబు కనఁబడకుండె,
దాఁటితిఁ దోఁటలు, దాఁటితి నిళ్లు
దాఁటితిఁ బుట్టలు, దాఁటితి గట్లు,
దాఁటితి నేళ్లును, దాఁటితి నూళ్లు ;
ఇళ్లును తోఁటలు, నేళ్లును నూళ్లు
నెన్నొ దాఁటితిఁగాని, యేమి లాభంబు ?

*    *    *    *    *

తెల్లవారఁగఁ జొచ్చెఁ దిమిరంబు వోయె,
వెచ్చని వెలుఁగుతో వెలిఁగె సూర్యుండు ;
చలికి మంచుకు నాకుఁ గలిగిన బాధ
వెచ్చని యెండచే విరిసిపోసాగె ;
లేయెండ నాకింత సాయంబొనర్చె,
నాదు మాణిక్యంబు నాకిచ్చునంచుఁ
బుట్టి డాసన బొంది పోవుచునుంటి ;
చెట్లుచేమలుపోయె, మట్టినేలలును,
బసిమిచాయలుపోయె, నిసుక యెడారి
కనుపట్టె—దానిలోఁ జనుచు నే నుంటి ;

గట్టినేలలుపోయె—వట్టియెడారి
నిసుకలోఁ గాలూని యేఁగుచునుంటి ;
ఎలయెండవెచ్చనై యుంపయ్యెనిసుక
దొరకు మాణిక్యమం చరయుచునుంటి.
ఆకసంబున మీఁది కతిగె సూర్యుండు,
ముదిరి వేఁడెక్కుఁ ద్రై, కదిరె నెండయును ;
ముదిరినయెండతో ముదిరెను వేఁడి,
వేఁడియు నిసుకయుఁ గూడె నెయ్యమున ;
వేఁడియు గాలియుఁ, గూడెఁ బ్రేమమునఁ
గాలిన యిసుకలోఁ గాలెఁ బాదములు,
కాలిన యెండలోఁ గాలెను దలయుఁ
గాలిన గాలిలోఁ గాలె దేహంబు ;
తలయు, దేహమును బాదంబులుమాఁడి
దాహంబుతోఁ గూడ దహియింపసాగె—

* * * * *

* * * * *

* * * * *

లేదు చల్లనినీడ, లేదు జలంబు,
మలమల నిసుకలో మాఁడుచునుంటి,
ముందుకుఁబోలేక మూల్గుచునుంటి,

వెనుకకుం బోలేక విసుగుచునుంటి,
వెనుఁజూచి, మునుఁజూచి, వెఱచుచు నుంటి,
లేదు మాణిక్యంబు, లేదు మోదంబు,
ప్రాణమే లేకున్నపగిదిఁ గన్పట్టె.
మట్టమధ్యాహ్నన, వట్టియెడారి
బట్టబైటనునిల్చి, పడరాని పాట్లు
పడుచున్న నాపైని ఏడవేమికినుక ?
కొనవేమిజాలి, చేకొనవేమినన్ను,
నాయమ్మ, నాతల్లి, ననుఁగన్నతల్లి,
నాయమ్మ నీకిది, ననుఁజూడవేమి ?
తలఁదాల్చి నీయాజ్ఞ, యిలువీడినాను,
వెదకి మాణిక్యంబువీక్షింప నెంచి,
గండ్లను ముండ్లను గడచనినాను.
త్రోవతప్పించి యీత్రోవఁ బెట్టితివి.
ఈత్రోవఁబెట్టితి వేటికోయమ్మ,
మలమల నిసుకలో మాడ్చుచున్నావు—
అగ్నిపరీక్షఁ జేయఁగనేలతల్లి,
కలదో నీపైభక్తి కలదోకో లేదో,
కలదో మాణిక్యంబు గనువాంఛలేదో,
తెలియఁగానెంచి, యీతీరుననన్ను

నగ్నిలోఁ బడఁద్రోసి, యలయింతువమ్మ !
నీపరీక్షకు నేను నిలువఁగాఁగలనె,
భరియింపజాలనీబాధ నాతల్లి !
మాణిక్యమును జూడ మదిఁగోర్కె విడదు,
భక్తి నీపైని నాకుఁ బలుచఁబాఱదును——*
వలదింకను బరీక్ష——నిలువఁగాఁజాల——
జాలిజూపించి నన్నేలుమోతల్లి ;
యనుచు నిరీతిగా నమ్మనువేడి,
యమ్మనుగొలుచుచు నడుగుముందిడఁగ ;
జల్లఁగాజిఱుగాలి చనుదెంచెనపుడు.

* * * * *
* * * * *
* * * * *

హాయిగొల్పెను జల్లనైన యాగాలి
యాగాలివచ్చి నా యసువులు నిలిపె,
లేనిసత్తువవచ్చి పూనె నాయెదను,
గాలివచ్చినదెసఁ గాల్ద్రిప్పినాను ;
చయ్యన గమనంబు సాగించినాను ;
ఇంచుకదవ్వు నే నేఁగకమున్న
ఖర్జూరవృక్షంబు గన్పట్టెనవల ;

రమ్ము౹రమ్మనిపిల్చెఁ గొమ్మచేతులను ;
వడివడి నా దెస నడచిపోయితిని,
ఖర్జూరవృక్షంబుకడ నిలుచుంటి ;
అచటఁగన్పడె నొక్క యమృతంపుబావి ;
హాయిగాఁ జల్లగాలి యటవీఁచుచుండె ;
చల్లగాలికిఁ దెప్పిరిల్లెఁజిత్తంబు.

*    *    *    *    *

ఖర్జూరవృక్షంబుకడఁ గొంతసేపు
చెమ్మటలారంగఁ జేరి నిల్చుంటి;
కొదుటఁ బ్రాణంబులు కూడె నొక్కింత;
అమృతంపుబావి మున్గాడసాగితిని;
అమృతంపుబావిలో నానంద మొప్ప
మునుఁగుచుఁ దేలుచు మునుఁగుచు నుంటి
మాణిక్యమనుమాట మఱచితినచట.
అంతలో మాణిక్యమనుమాటతోఁచె;
బావిలోపలనుండి పైకివచ్చితిని,
మాణిక్యమునుజూడ మరులుఁజెందితిని.
ఖర్జూరవృక్షంబుకడకు వచ్చితిని.
అమృతంపుబావిలో నటజన్మముంది
యల్లిబిల్లిగనల్లి, కొల్లఁగాఁ బూచి,

యడవిమల్లియతీఁగె యలరారుచుండె;
కొమ్మచేతులతోడఁ గోరి వృక్షంబు
దయఁజూపె నడవిమల్లియ తీఁగె నాకు,
అడవిమల్లియతీఁగె నరసికన్గొంటి,
నానంద మొకసారి యావిర్భవిల్లె;
మాణిక్యమనుమాట మఱచిపోయితిని.
అడవిమల్లియపైని స్వాంతంబునిలిచె;
ఎన్ని జన్మములందో యేనును నదియుఁ
గలసి యానందంబుగని యున్నయట్లు,
చప్పునఁ దోఁచె నాస్వాంతంబునందు.
అడవిమల్లియతీఁగె నపుడు కౌఁగింటఁ
జేర్చి, యానందంపుసీమ దాఁటితిని.
పక్వఫలంబు లుపాయనమిచ్చి,
ఖర్జూరవృక్షంబు గౌరవంబిచ్చె;
అమృతంపుబావిలో నమృతంబుఁ గ్రోలి,
ఖర్జూరఫలము లుత్కలికభుజించి,
అడవిమల్లియతోడ నాడసాగితిని,
మాణిక్యమనుమాట మఱచిపోయితిని,
మఱచితి లోకంబు మఱచితి నిల్లు,
అడవిమల్లియఁగూడి యాడుకొంచుంటి.

కలిగె మనశ్శాంతి, కలిగె సంతృప్తి—
కలిగె నానందంబు, కలిగెనన్నియును.
అమ్మచెప్పినమాట యూఁకొంటినప్పుడు,
వెదకికన్గొనుటె వివేకంబటంచు
నమ్మచెప్పినది సత్యంబుగాఁ దోఁచె.
వెదకితి—కనుఁగొంటి—ముదముఁ జెందితిని.
పూర్వజన్మములం దపూర్వమౌ ప్రేమ
ననుఁగూడియుండిన నామల్లితీఁగె
ననుఁజేరి యానందమును గల్గఁజేసె.

* * * * *

అమ్మ చెప్పినమాట యాలకించితిని,
అమ్మకారుణ్యంబు నందఁజాలితిని;
నామల్లితీఁగెయే నాకుఁగన్పడియె;
అమృతంపుబావితీరమున నిచ్చోట
నీకల్పవృక్షంపుటింపుఁగ్రీనీడ
నడవిమల్లియతోడ నాడుకొంచుందు;
ఆటాడి యానందమందుచునుందు;
అడవిమల్లియయు నే నాటాడియాడి,
అమృతంపుబావి మున్గాడితేలెదము;
అందులోమాయమ్మ నరసిచూచెదము,

అమ్మలోఁగరఁగి మేమంతరించెదము,
అడవిమల్లియతోడ నంతరించెదను.

*     *     *     *     *

*     *     *     *     *

*     *     *     *     *

అమ్మచెప్పినపల్కు లాలకించితిని.

*     *     *     *     *

---

# విరిసెజ్జ

## iii

God is Love: and he that dwelleth in
Love dwelleth in God and God in him.

— *The Holy Bible*

చిత్కలానందకలికా ప్రేమరూపా ప్రియంకరీ
ప్రాణేశ్వరీ...................

లలితా సహస్రనామ స్తోత్రము

*    *    *    *    *

అమ్మకారుణ్యాని కంతంబులేదు.

*    *    *    *    *

*    *    *    *    *

మాఁతోటలో నొక్క మందారచెట్టు—
ఆచెట్టుచెంతనే యమృతంపుబావి,
అడవిమల్లియతీవ యాఁబావిక్రేవ,
ఆమల్లెతీవతో నాడుకొంచుంటి.

*    *    *    *    *

జిలుఁగుఁబూవులబుటాల్ సెలువారుచున్న
యాకుఁబచ్చనిచీర హాసుమైఁదాల్చి,
నెమ్మనివాసనల్ నిండఁజేయుచును
జిగురుఁజేతులతోడఁ జేరఁగాఁబిల్చి,
తీఁగబుజాలతోఁ గౌఁగిటంజేర్చి,
తేఁటిపాటలఁ బాడి, తీవులంగొల్పి,
దినమున కొక క్రొత్తతీరుగాఁ దోఁచి,
యడవిమల్లియతీఁగ యానందమిచ్చె.

* * * * *

మందారవృక్షంబుక్రిందఁ గూర్చుండి,
యడవిమల్లియఁ గూడి యాటాడుకొంచు,
ననునేనె మఱచి యానందంపుఁగడలి
మునుఁగుచుఁ దేలుచు మానుఁగుచు నుంటి.
ఇనుఁడ స్తమించుట యెఱుఁగనియట్లు
దినములు రేలును జనియె నెన్నెన్నో.

* * * * *

* * * * *

ఒకనాఁటి తొలుసంజ నుత్సాహమొప్ప
నడవిమల్లియఁ గూడి యాడుకొంచుండ
వింతవింతలపాట వినవచ్చె నొకటి.

పాట వినఁబడుప్రక్కకుఁదిరిగి
మనసారఁగా దాని వినుచు నేనుండ
క్రొంగ్రొత్తవింతరంగులు కనంబడియె,
ఆపాట లారంగు లటు లాగెమనసు,
మనసు మెల్లఁగ లాగికొనిపోయెనన్ను ;
అడవిమల్లియపీడి యటుపోవుచుంటి.
మందారవృక్షంబు మఱచిపోయితిని.
అమృతంపుబావి దవ్వయ్యెను నాకు.
తోఁటను దాఁటితిఁ బాటలేదయ్యె ;
పాటలు రంగులు ప్రక్కనే చెలఁగె ;
దరిఁజేరఁగాఁబోవ, దవ్వయ్యెఁబాట
దరిఁజేరఁగాఁబోవ, దవ్వయ్యెరంగు ;
దరిదరిగాఁబోవ, దవ్వుదవ్వగుచుఁ
బాటలు రంగులు పాఱిపోసాగె ;
పాటలు రంగులు పాఱుచునుండ,
వెంబడించుచు నేను వెడలసాగితిని.
వీనులకింపుగా వినుచుంటిఁబాట
కన్నులకింపుగాఁ గనుచుంటిరంగు,
పాటలు రంగులు పట్టెను మనసు,
మనసు లాగుచునన్ను మఱిమఱియీడ్చె ;

# విరిసెజ్జ

మాతోట విడనాడి మఱిమఱిపోయి,
మఱిపోయి, మఱిపోయి, మఱిమఱిపోయి,
వెఱ్ఱియెత్తినరీతి వెడలసాగితిని,
తోట కన్పడలేదు, దూరమైపోయె;
పాట విన్పడలేదు, పాటె నెయ్యెడకొ,—
తొలుత నీరంగులు తెలియరావయ్యె;
లేవయ్యె రంగులు, లేదయ్యెఁ బాట,
బాట లేదయ్యె, మా తోఁటలేదయ్యె.
ఎందు నేనుంటినో యెఱుఁగలేనైతి,
ఏమి చేయఁగనౌనొ యెఱుకలేదయ్యె.
వెనుకకుఁబోలేను, గనరాదు బాట,
ముందుకుఁ బోలేను మునుము కన్పడదు.
మనసు నిల్పఁగలేక, మఱినిల్వలేక,
పోవుచునుంటిని, —పోవుచునుంటి
ఎటుపోవుచుంటినో యెఱుఁగను నేను,
వెనుకకో ముందుకో వివరింపలేను,
పోవుచునుంటిని—పోవుచునుంటి.

*   *   *   *   *

*   *   *   *   *

మలుసంజవచ్చెఁ గ్రమ్మఁగఁజొచ్చె నిరులు,

కాఱుచీఁకట్లు నల్లడఁ జిందుచుండె,
గండ్లలో ముండ్లలోఁ గదలలేకుంటి,
నడవిలోవల నొంటి నడలుచు నుంటి,
కీల్గలమొకములు గీపెట్టినట్లు
లుఱుముచునుండె నబ్బురపుమొయిళ్లు ;
వానతొండాలతోఁ బైఁబడుచుండె,
గడగడలాడించి గాలులువీఁచె,
అడవిచెట్లులు మీఁదఁబడునట్లులుండె;
దయ్యఁపుటత్తిలో ల్దాఁకెనుదుదిని;
తుదిఁదాఁకె ధైర్యంపుఁదునుక వెలుంగు,
నడలుధైర్యంబుతో నడలునఁగుంది,
యలసిపోయితి ముందుకడుగిడలేక.
——అలసిపోయితిని——
ఏమేమొయనుకొంటి; ఏడ్వసాగితిని,
అలసిపోయితి నయ్యొ, అలసిపోయితిని.
అలసిపోయితిని——
అలసిపోయితి నయ్యొ, అలసిపోయితిని,
కటకటా నీకింత కాఠిన్యమేల?
* * అలసిపోయితిని.

* * * * *

తిరిగితిఁదిరిగితిఁ దెరువులన్నియును, *
వెదకితివెదకితి వేసారిపోతి,
ఏమూలనంటివో యీచలంబేల,
యెందు దాఁగుంటివో యేలకన్పడవు!
అలసిపోయితి నయ్యో, అలసిపోయితిని,
కటకటా, నీకింత కాఠిన్యమేల ?

* * * * *

గట్టుపైఁ బుట్టపై గాల్జారిజారి,
పడుచు, లేచుచు, ముండ్లబాటలన్నియును,
వెదకితి, వెదకితి, విసివిపోయితిని;
తిరిగితిఁదిరిగితిఁ దెరువులన్నియును,
అలసిపోయితి నయ్యో, అలసిపోయితిని,
కటకటా నీకింత కాఠిన్య మేల ?

* * * * *

ఆకసంబున మబ్బులలముకొన్నపుడు,
చీఁకటి యంతటం జెదరి యున్నపుడు,
వర్షంబు బోరనఁ బడుచున్నయపుడు,
తిరిగితిఁ దిరిగితిఁ దెరువుదప్పితిని,
అలసిపోయితి నయ్యో, అలసిపోయితిని,

కటకటా, నీకింత కాఠిన్యమేల ?

*　　*　　*　　*　　*

ఏమనుకొంటినో యెఱుఁగను నేను,
ఏమి కావలయునో యెఱుఁగలేనైతి,
అలసిపోయితినంచు నడచుచునుంటి ;
మింటఁ తళుక్కన మెఱపొండు మెఱసె,
మెఱపువెల్గునఁ గనుల్ మిఱుమిట్లు గొల్ప,
యెదుటఁ గన్పడెఁ బదియేండ్ల బాల—
పదియేండ్ల బాల నాయెదుటఁ గన్పడియె,—
ముసిముసినగవుల ముదమిచ్చెఁ బాల,
లోలోనఁ దనిసితి బాలవైఖరికి,
చేసాపి, కౌఁగింటఁ జేర్చెనన్ బాల,
కరఁగి నాలోపలఁ గలసెను బాల,
కరఁగించి, లోనన్నుఁ గలపెను బాల ;
నాలోన బాలయు, బాలలో నేను,
గరఁగి, యొండొరులోనఁ గలసిపోయితిమి.
ఏమయియుంటినో యెఱుఁగను నేను,
నేననుమాటయే పూనకయుంటి,
ఎంతసేపుంటినో యెఱుఁగనిమ్మాన్కి.

*　　*　　*　　*　　*

*   *   *   *   *

*   *   *   *   *

తెలివివచ్చెను ; చుట్టుఁ దేరిచూచితిని,
ఒక్క యుద్యానమం దుంటిని నేను,
వింతవింతల చెట్లు, విలసిల్లుచెట్లు,
రంగురంగులపూలు, రాణించుపూలు,
వింతలపండ్లును, వింతలంగొల్పె.
వింతలఁజూచుచు, వింతలఁగొనుచు,
వింతముదంబున వెడలుచునుంటి.
పూవుటోరంబునఁ బూలు కోయుచును,
బాలకన్పడె, నాదు ప్రేమఁ నొక్కఁడను.
బాలగాదిప్పుడు, ప్రౌఢయుఁ గాదు ;
లసిత నిర్మల మంజుల మనోజ్ఞమైన,
లలితరూపముఁదాల్చి యలరారుచుండె.
ఆలలితాకార మరయుచునుంటి,
నానందమునఁ దేలియాడుచునుంటి,
ననుఁజూచి, తరుణి యానందంబునొందె,
ఆనందమునఁ జెంతకరుదెంచెఁ దరుణి ;
ప్రేమ చూపులలోన వెలయుచు నుండఁ
జల్లనిచేతులుసాపి, కౌఁగిట

నను(జేర్చి, తనివార నను ముద్దులాడె ;
ముద్దాడుతరుణిని ముద్దాడుచుంటి,
ముద్దాడుచుంటిని, ముద్దిడుచుంటి,

* * * * *

* * * * *

తరుణుండనై నేను తరుణియై తరుణి,
ప్రేమస్వరూపాల వేత్తెఱుంగకయ
సారూప్యమునఁబొంది సంతసించితిమి.
సారూప్యమునఁబొంది సంతసంబొప్ప
సతితోడ నేనును, సతియు నాతోడ,
నాటపాటలమున్గి యలరసాగితిమి.

* * * * *

* * * * *

* * * * *

* * * * *

సీ. అభిరామ నవపల్లవారామకుంజవా
టికలఁగీరముల నాడించుకొనుచుఁ,
బద్మాలయోదర ప్రౌఢసారసవీథి
నంచలవేడబం బరసికొనుచు,

గాంగేయధామశృంగవిటంకముల నీల
కంధరోజ్జ్వలగతుల్ గాంచికొనుచు,
విమలసింధుద్వీపవేదిక నరుణాప్త
ఖగవిహారప్రౌఢిఁ బొగడికొనుచు,
రతియుఁ జేతోభవుఁడు, భారతియు నజుఁడు,
శచియు నమరాధినాథుండు, జలధిసుతయు,
నజ్జనాభుండు (నయి) మించి, యఖిలసమయ
సముచితక్రీడ నలిపితి సతినిగూడి.

(వసుచరిత్రము—ఇంచుక మార్పుతో)

* * * * *

* * * * *

ఆటపాటలలోన నసఁగిపెనంగి,
యేనును దరుణియు నింపొందుచుండ,
దినము లొక్కొక్కటి చనుచునేయుండె,
క్రొత్తక్రొత్త ముదంబు గూర్చుచునుండి,
దినదినంబును మార్పుఁ గనుచుండెఁ దరుణి.
తరుణరూపంబునఁ దరుణితోఁదొల్త
సారూప్యభావ మొప్పారంగనంటి.
సారూప్యభావంబు సడలగాసాగె.
ప్రేమ గౌరవమాచుఁ బెంపొందసాగె.

## విరిసెజ్జ

ప్రేమతో గౌరవప్రీతి కన్నట్టె
గౌరవంబున నేను గనుచుంటిఁ గాంతఁ
ప్రేమతో నను గాంత వీక్షించుచుండె.
విరిసెజ్జపైఁ గాంత నరసినవేళ,
సింహాసనేశ్వరి చెలువున నుండె.
మోహగౌరవములు మొనయుచునుండ,
శ్రీమహారాజ్ఞిఁ గాంచినరీతిగాఁగ
సంతసించుచునుంటిఁ గాంతఁ గన్గొనుచు.
కనుట కింపగుపూవుఁ గొని తెచ్చియిచ్చి,
తినుట కింపగుపండు గొని తెచ్చియిచ్చి,
కాంతకుఁ బరిచర్య గావించుచుంటి.
నాపరిచర్య సంతసమిచ్చెసతికి,
సతిని సేవించి నే సంతసించితిని.
ఆసేవతోఁజె బ్రహ్మానందమున్గ్ను.
మఱచితినామాట, మఱచితినన్ను,
కాంతనుగొల్చుటే కార్యమైయుంటి.
ఏకచిత్తంబున నీరీతిఁ గాంతఁ
గొలుచుచుంటిని, దినమ్ములు సాగుచుండె.
పరిపూర్ణమౌప్రేమ పరగించి, కాంత
నన్నుమాత్రమె చూచుచున్న దటంచు

ననుఁగొంచు, సేవించుకొనుచుంటిఁగాని,
ప్రేమలో వేఱొక్కవిధము కన్పట్టె.
పూవులాకులువైచి పూజించుచెట్లఁ
బ్రేమతో నాయింతి వీక్షించుచుండె;
ముద్దుగాఁబల్కెడు ముద్దుఁజిల్కలను
బ్రేమతో నాయింతి వీక్షించుచుండె.
పాటపాడెడు తేఁటి నాటాడు నెమలిఁ
బ్రేమతో నాయింతి వీక్షించుచుండె.
ఇంతిప్రేమయె నాకు నెందుఁగన్పట్టె.
ననుఁబోలె లోకమంతయు నింతిప్రేమఁ
గనుచుండెనన్నట్లు కన్పట్టెనపుడు.
మూఁడులోకంబుల మోహింపఁజేసి,
మోహినీరూపంబుఁ బూని యాయింతి,
ననుఁజూచి, ముసిముసినగవున నొప్పె.
ముసిముసినగవులో మునిఁగిపోయితిని,
మఱచితి లోకంబు, మఱచితి నన్ను,
ముసిముసినగవులో మునిఁగిపోయితిని.
తెలివివచ్చెను; చుట్టుఁ దేరిచూచితిని,
అడవిమల్లియతోడ నాడుచునుంటి;
విరిరాలె మందారవృక్షంబునుండి,

పిల్ల తెమ్మెర మెల్ల మెల్లఁగా వీఁచె,
అడవిమల్లియ వింతయగుచుఁ గన్పట్టె,
బాలరూపమునఁ గన్పడినట్టి కాంత,
లలితరూపమునఁ జెలంగిన కాంత,
శ్రీమహారాజ్ఞియై చెలఁగిన కాంత,
యడవిమల్లియలోన నలరారుచుండె.
మూఁడురూపంబుల మొనసి కన్పట్టి,
మూఁడు లోకంబుల మోహింపఁజేసి,
ప్రేమస్వరూపమై, ప్రీతినింపుచును,
మూఁడుమూర్తులకును మూలమైనట్టి
యాయమ్మయొక తెయే యడవిమల్లియును
నాకుఁగన్పడుచుండి, ననుజూచుచుండ,
నబ్బురపాటుతో ననుఁగొంటినిట్లు :
"అమ్మ, నీప్రేమకు నంతంబుకలదె ?
నాతప్పులనుబాపి ననుఁ బ్రోచినావు ;
తప్పుత్రోవనునిల్చి తలఁకొంద నేల ;
అమ్మనునమ్మిన నగవడుఁద్రోవ ;
అమ్మకారుణ్యాని కంతంబు లేదు."
అనుచునీరీతిగా ననుఁగొనుచుండి,
అమ్మరూపంబున నలరారుచున్న

యడవిమల్లియఁ గూడి యాడుకొంచుంటి. *
అమృతంపుబావిలో నమృతంబుఁ గ్రోలి,
మందారవృక్షంబుఁ గ్రిందఁ గూర్చుండి,
అడవిమల్లియతోడ నాటాడుకొందు ;
అడవిమల్లియతోడ నమ్మలోఁ గరఁగి,
యమృతంపుబావిలో నణఁగిపోయెదను,

* * * * *

అమ్మకారుణ్యాని కంతంబు గలదె ?

* * * * *

* * * * *

* * * * *

* * * * *



# విరిసెజ్జ

## iv

ఓం—జాగ్రత్సుషుప్తికృత దక్షిణవామ భాగాం
స్వప్నస్వభావ పరికల్పిత జఘన్య భాగాం,
తుర్యాతితుర్యఘటితానన హృత్ప్రదేశాం,
ప్రాణేశ్వరీం పరశివ స్వపరామృశామః॥

శ్రీమాతృకాచక్రవివేకః—

Watch—for ye know neither the day
nor the hour, wherein the son of man
cometh.

.—*The Holy Bible*

నిదురవలె, నిదురలోనొదవు స్వప్నమ్మువలె,
యడుగుఁసడిలేక, నన్నావరించెదవు;
గాలివలె, గాలిలోఁదూలు సౌరభమువలె,
చూచాయఁ గొలుపకే, సురిగిపోయెదవు;
ఎపుడో నీ యాగమన, ఎపుడో నీ నిష్క్రమణ !

శ్రీ. శ్రీ.

* * * * *

* * * * *

కనిపెట్టుకొనియుంటిఁ గాంతనుజూడఁ
గాంతఁ గౌఁగిటఁ జేర్పఁ గనిపెట్టుకొంటి.

* * * * *

* * * * *

జాజులు, మల్లెలు, సంపెంగపూలు,
పారిజాతములు, గన్నేరుపూవులును,
చెంబేలి, దిరిసెన, చేమంతివిరులు,
బంతిబంతులుగాఁగ, వింతలంతలుగ,
వింతల వింతల బంతులఁ దార్చి,
సెజ్జఁగాఁగూర్చి, పేర్చి, వెలార్చి, యోర్చి,
కనిపెట్టుకొనియుంటిఁ గాంతనుజూడ.

* * * * *

ఆకులతోడ వియ్యంబు లందుచును,
గారుచీకట్లు నల్లడఁ గ్రమ్మి యొప్పె.
అలరుగుత్తులతోడ నాటలాడుచును,
నలరుచుక్కలు తళ త్తళ లీనుచుండ.
ఆటలఁ బాటల మేటితనమ్ము
కొమ్మలకును నేర్చి, కూడిపాడుచును,

నాడుచుఁ జిఱుగాలి యందముల్ గొల్పె.

*       *       *       *       *

దూరాన నొకవెల్గు తోఁచుచునుండె.
వెలుఁగులో నొకమేడ వెలుఁగుచునుండె.
అచట మూఁడంతస్తు లావలిప్రక్కేవ
నాల్గవ యంతస్తునం గనంబడియె,
మెఱపట్లు మెఱయు నెమ్మోని కాంతులను
గ్రొందళ్కు లీనుచు సుందరియొకతె.
అందు మూఁడంతస్తు లందునుగూడఁ
గలరెండతెండటో తలిరుఁబోండ్లైన
నాల్గవ యంతస్తునం గనంబడ్డ
సుందరియే మది చూఱలు గొనియె.
లోకంబు మఱపించి లోనన్నుఁగూడె,
కాని, యావెంటనే కానరాకుండె;
మేడలో నింతులు నేడకోచనిరి.

*       *       *       *       *

అరయుచు నొక్కెండ నటుఁగూరుచుంటి,
నామది చూఱగొన్న మనోహరాంగి
నాదు చెంతకువచ్చి ననుఁబ్రోచునంచు,
విరిసెజ్జ సరిచేసి వేఁచియుండితిని.

కాంతను జూడంగఁ గనిపెట్టుకొంటి.

*  *  *  *  *

విరులతోఁ జుక్కలు వియ్యంబు వేఁడె
గాలి కొమ్మలఁగూడి మేలంబులాడె,
చీకటి యాకులు చెలిమిని గూడె.

*  *  *  *  *

*  *  *  *  *

తారుచుఁ దక్కుచు దరిదరిగాఁగ
దవ్వుదవ్వులనుండి తరుణియొక్కర్తు
నాదు చెంతకువచ్చి నామ్రోల నిలిచె.
క్రొత్తరంగులతోడఁ గ్రొత్తదనంబు
క్రొత్తక్రొత్తగఁజూపి, కోర్కిమీరంగ,
నెదుటనిల్చిన కాంత నీక్షించుచుంటిఁ
గాని, చిత్తంబు లగ్నంబుకాదయ్యె.
పలుకరించితిఁ గాంత పలుకాడదవింటెఁ
జిత్తమాకర్షించు చెయ్యి లేకుండె.
సహజంపుఁబలుకాడు శక్తి లేకుండె.
నిలువదు చిత్తంబు నీపైసినాకు,
లేదు రంగులపైని లేదు నాకాశ,
మేడలోఁ జూచిన మెలఁతవుకావు;

కాదు నావిరిసెజ్జ కాదు నీకింక
వెడలిపొమ్మిటనుండి వెడలిపొమ్మనుచు,
నాయింతి నటనుండి యంపివైచితిని.
కనిపెట్టియుంటి నింకను గొంత సేపు.

*　　*　　*　　*　　*

నా ప్రేమాల కేతెంచె నాటి యొక్కర్తు.
ముస్తీబులోఁ గ్రొత్తమురిపెంబు లేదు,
కాని, మాటలు మేటిగా నడుచుండె.
చకచక పలుకులు సాగించుచుండె;
విరసాలు, సరసాలు వెడలుచునుండె.
మాటల తేటకు మనసొప్ప లేదు,
చిత్తమా నాతిపైఁ జేరఁగా లేదు.
కాదు నావిరిసెజ్జ కాదు నీకింక
వెడలిపొమ్మని చెప్పి వెనుకమోమైతి.
ఆనాతి యటనుండి యరిగె నెవ్వడకో.　　*

*　　*　　*　　*　　*

ఇంతలో నొకయింతి యేతెంచె నటకు.
ముస్తీబులోఁ గొంత ముచ్చటకలదు;
కాదంత ప్రాఁతది, కాదంత క్రొత్త
గాని, మాటలలోనఁ గనవచ్చెలోఁతు.

లోఁతైనమాటలు, లోలోనరసము,
కొంతకొంతముదంబు గూర్చె నామదికి.
క్షణకాల మాయింటఁ గనఁగొనుచుంటిఁ
గాని, చిత్తంబు లగ్నంబు కాదయ్యె.
చేసినమీ సేవ చేయువేళం జూచి,
తెచ్చిన యందంబు తెన్నులుచూచి,
కొని తెచ్చు మాటలకొలఁదులుచూచి,
చిత్త మానందంబు జెందకయుండఁ ;
కాదు నా విరిసెజ్జ కాదు నీకనుచు,
నాయింతి పటునుండి యంపివైచితిని.
మనసున కానందమును గూర్పఁగల్గి
విరిసెజ్జపై నిల్చి, కరమనురక్తి
ననుఁగూడఁగలకాంత కనఁబడదొక్క
యంచు నిరాశతో నరయుచునుండఁ
దళుకుతళుక్కను తనుకాంతితోడ
నెదుటఁగన్పడె నొక్కయింతి యాక్షణమె.

*  *  *  *  *

*  *  *  *  *

*  *  *  *  *

దూరాన మేడపై, గారాముమీర

## విరిసెజ్జ

నాల్గవ యంతస్తునను గనంబడ్డ
యా చిగురుంబోడి, యా మోహనాంగి,
మొదటఁ గన్పడెనాకు ముదముఁగొల్పుచును.

* * * * *

అరవిడినగులాబి యందంబువోలె
సహజమై యొప్పారె సతిచక్కఁదనము.
గాలి కాడెడుకొమ్మ మేలిపాటట్లు
సహజమై యొప్పారె సతిపాడుపాట.
విరిసిన మల్లియవిరితావి రీతి
సహజమై యొప్పారె సతితేటమాట.
కపటమింతయులేదు ; కల్లయులేదు ;
తెచ్చిన యందంపుఁదీరును లేదు ;
తెచ్చిన మాటలతీరును లేదు ;
ముద్దుఁజూపులతోడ ముద్దులఁగూర్చి,
ముద్దుమాటలతోడ ముద్దులఁగొల్పి,
విరిసెజ్జచందాన వింతలంబొల్చె.
ఆయింతిపైని నాస్వాంతంబునిల్చె ;
చేసాపి యాయింతిఁ జెంతఁజేర్చితిని,
చేర్చితిఁ గౌఁగింటఁ జేర్చితి నంత

విరిసెజ్జ

విరిసెజ్జపైఁజేర్చి, మఱచితిఁదనువు.

* * * * *

* * * * *

* * * * *

* * * * *

విరిసెజ్జపైనిల్చి విరిబోణినైతి,
విరిబోణితోఁ గూడి విరిబోణినైతి,
విరిసెజ్జపై నేను విరిబోణినౌచు
నద్వయానందంబు ననుభవించితిని.

* * * * *

దూరాన వెలుఁగులోఁ దోఁచియున్నట్టి
యామేడపైని మూఁడంతస్తులవల
నాల్గవయంతస్తునం గాంతఁగూడి
విరిసెజ్జపై నిల్చి, విరిబోణినౌచు
నద్వయానందంబు నందుచునుంటి.

* * * * *

విరిబోణితోఁ గూడి విరిబోణినౌచు
విరిసెజ్జపై నిల్చి విలసిల్లువేళ
నాల్గవయంతస్తునను గాదు నిల్చి
యైదవయంతస్తునంది యుందుంటి.

ఏమయియుంటినో యెఱుఁగను నేను,
నేను నేనై యున్న నెనరు కన్పట్టె.
ఎంత సేపుంటినో యెఱుఁగను నేను,
నేను నేనైన చందానఁ గన్పట్టె.

*　　*　　*　　*　　*

*　　*　　*　　*　　*

*　　*　　*　　*　　*

*　　*　　*　　*　　*

తెలివివచ్చెను; చుట్టుఁ దేరిచూచితిని,
విరిసెజ్జ చెంతనే యరయుచునుంటి.
నాల్గవయంతస్తునకుఁ గొనిపోయి,
మొదవయంతస్తునందు నన్నుంచి,
తలరించి, యలరించి, తలిరాకుఁబోణి,
మాయమైపోయినమాడ్కి నెంచుచును,
వెలవెలఁబాఱుచుఁ దలఁచుకొంచుంటి.

*　　*　　*　　*　　*

*　　*　　*　　*　　*

*　　*　　*　　*　　*

ఆకులుఁ జీఁకట్ల నరయుచునుండె,
చుక్కలు, విరులును జూచుచునుండె,

## విరిసెజ్జ

గాలియుఁ గొమ్మలుఁ గనుఁగొనుచుండ,

విరిసెజ్జకడనేను వేచియుండితిని.

*   *   *   *   *

*   *   *   *   *

*   *   *   *   *

కనిపెట్టుకొనియుంటిఁ గాంతను జూడ.

*   *   *   *   *

*   *   *   *   *

*   *   *   *   *

*   *   *   *   *

కాంతఁ గౌఁగిటఁ జేర్చఁ గనిపెట్టుకొంటి.

---

# విరిసెజ్జ

## V

1. This my son was dead, and is alive again.
   He was lost and is found.
2. Except ye repent, ye shall all likewise perish.
3. Thy heart is not right in the sight of God. Repent, therefore, of this, thy wickedness, and pray God, if, perhaps, the thought of thine heart, may be forgiven thee, for, I perceive that thou art in the gall of bitterness and in the bond of inequity.

*The Holy Bible.*

*   *   *   *   *

ఆనందమునఁ దేలియాడుచునుంటి ;
ఆత్మేశ్వరింగూడి యంతంబులేని
యానందవార్ధి మున్గాడుచునుంటి ;

*   *   *   *   *

దినములు, రేలును, జనియె నెన్నెన్నొ,
యెన్నియేండ్లయ్యెనో యెఱుఁగను నేను ;

ఆనందమునఁ దేలియాడుచునుంటి,
ఆత్మేశ్వరింగూడి యంతంబులేని
యానందవార్ధి మున్గాడుచునుంటి ;

*    *    *    *    *

ముద్దుఁజూపులతోడ ముచ్చటల్గొల్పి,
ముద్దుమాటలతోడ మురిపెముల్గొల్పి,
ముద్దులమూటయై ప్రేమలనిల్పుచును,
ముద్దులసుద్దుల మోహంబుగొల్పి,
యల్లారుముద్దుగా నరయుచునున్న
యాత్మేశ్వరినిగూడి, యంతంబులేని
యానందవార్ధి మున్గాడుచునుంటి.

*    *    *    *    *

*    *    *    *    *

*    *    *    *    *

చైత్రమాసంబునఁ జిత్రమారీతిఁ
గ్రొత్తపూవులుపూఁచెఁ గ్రొమ్మావిగున్న ;
నిండుపున్నమనాఁటి పండువెన్నెలను
మావిగున్ననుజూడ మనసయ్యెనాకు.
అమృతంబుగ్రోలెడు నందాలకుప్ప,
నేరుపుల్ సూపెడు నెఱపాటకాఁడు,

తుమ్మెదనెయ్యుండు తోడఝువచ్చె ;
క్రొమ్మావిగున్న కన్గొనుచు నిద్దఱము
నానందపారవశ్యమున మున్గితిమి.
విరికన్నెలకులోఁగి, సరసాలఁదోఁగి,
యాకుసంపులడాఁగి, యమృతంబుద్రాగి,
యేజాడఁజూడఁ దానేయాచు రేఁగి,
యాడుచుఁ బాడుచు, నానల్లనయ్య
విశ్వరూపముఁదాల్చి, వేడుకల్ సలిపె.
నిండుపున్నమనాఁటి పండువెన్నెలను,
విరికన్నియలతోడి సరసాలఁ గూడి,
పాడుచు, నాడుచుఁ బాలులాడుచును,
విశ్వరూపముఁదాల్చి, వేడుకల్నూపి,
యానల్లనయ్య నాకానందమిచ్చె ;
ఆనందమునఁ దన్మయంబయ్యె మనసు.

*  *  *  *  *

కొంటితనమ్ముల కూర్మిచుట్టాలు,
గాలిపిల్లలు మావికడ కేఁగుదెంచి
గంతులువైచుచుఁ బంతాలుమీరఁ
బైఁబడి హాస్యాలప్రభ చూపిరపుడు.
గాలిపిల్లలఁగూడి, మేలమ్ములాడి,

వింతలతావులు వెనువెంటవచ్చె.
హాస్యాల మేళాల కలరేఁ జిత్తంబు.
తన్మయంబయ్యెఁ జిత్తంబంతనాకు.
అలరుగన్నియలతో నాటాడి యాడి,
తుమ్మెదద్రిమ్మరి యెమ్మెలుగ్రమ్మఁ
దావులేతెంచిన తావుల త్రోవఁ.
బరుగెత్తిపోసాగెఁ బాటఁబాడుచును. *
తుమ్మెదనెచ్చెలితోడ నేఁగూడఁ
బరుగెత్తుచుంటి, నబ్బము నొందుచుంటి.

*          *          *          *          *

దూరాన నొకయింతి తోఁచె మాయెదుట.
పొగడపూఁబొదరింటఁ బూఁబాన్పుపైని
దూరాన నొకయింతి తోఁచె మాయెదుట.

*          *          *          *          *

నాకన్నమున్నుగా నాదునెయ్యుండు
పరుగెత్తి, యాయింతిదరికి వేపోయి,
ఏకాంతముగఁ జెవి నేమేమొ చెప్పి,
మఱికనంబడకుండ మాయమైపోయె,
పొదరింటిదరిగాఁగఁ బోయితినేను.
కాని, నా నెయ్యుండు కానరాఁడయ్యె.

ఎదుటఁగన్పడుచున్న యింతినిఁజూచి,
యింద్రియంబులవెల్ల నిఁపునంబొల్చె.

*  *  *  *  *

చూపులలోనుండి సోగియించుపాట
చెవులకానందంబు సేయుచునుండె.
చెవులతీగనుండి యుప్పొంగుతళ్కు
కనులకానందంబు కలిగించునుండె.
మోముతేఁటలనుండి సోలు వారుతీపు
నాల్కకానందంబు చిల్కుచునుండె.
ముక్కుసోయగమున మొనయుమార్దవము,
తనువునకానందమును గూర్చుచుండె.
తనువుచాయలనుండి చనుదెంచుతావి
ముక్కునకానందమును గూర్చుచుండె.
ఆయంద మాచంద మరయ మనుండ,
నింద్రియంబులవెల్ల నేకత్వమొందె;
తనువెల్లఁగనులయి కనుఁగొనుచుంటి.
తనువెల్లఁగనులయి తనుఁజూచుచున్న
ననుఁజూచి, ముసిముసి నవ్వె నాయింతి.
నవ్వుచు నిలుచుండి, ననుఁజేరవచ్చె;
చేసాపి, కౌఁగిటఁ జేర్చెను నన్ను;

అలరుఁబానుపుఁజేర్చి యలరించెనన్ను;
ఎందు నేనుంటినో యెఱుఁగలేనైతి,
ఏమియైయుంటినో యెఱుఁగలేనైతి.

*　　*　　*　　*　　*

*　　*　　*　　*　　*

ఏకచిత్తంబున నింతితోఁ గూడి,
యానందరూపుండనై వెల్గుచుంటి.
చైత్రంపుమాసానఁ జిత్రంపురీతి,
నిండుపున్నమనాఁటి పండువెన్నెలను,
పూఁబొదరింటిలోఁ బూపుఁబాన్పునను,
పూఁబోణితోఁ గూడి, పోడుముల్ నలిపి,
ననునేనెమఱచి, యానందంపుఁగడలి
మునుఁగుచుఁ దేలుచు, మునుఁగుచునుంటి.
పిలిచినరీతిగాఁ బలుకుచునుండి,
చెప్పినపనులెల్లఁ జేయుచునుండి,
నిలుచుచుఁ గనుసన్న మెలఁగుచునుండి,
యడిగినదంతయు నందిచ్చుచుండి,
తనకు నాకన్న వేఱను మాటలేక,
తానె నేనయి, నేనె తానయినట్లు
భేదమింతయులేని ప్రీతిఁజూపుచును,

## విరిసెజ్జ

పూఁబొదరింట నిర్వారము నిల్చితిమి.
ఇంటినిమఱచియు, నిల్లాలిమఱచి,
అంతయునింతియే యైనచందాన
నాపూవుటోరంబునందు నిల్చితిని.
ఆనందమునఁ దన్మయంబయ్యె మనసు,
మనసార నింతి నక్కునఁజేర్చికొంటి.
ఇంతియక్కునఁజేరి యిమిడినేనుంటి,
నిలిచితినక్కున, నిదురఁజొక్కితిని,
ముదమునఁజొక్కితి, నిదురఁజిక్కితిని.
మఱచితిలోకంబు, మఱచితిఁదనువు,
ననునేనెమఱచి యానందమందితిని.
ఎంతసేపయ్యెనో యెఱుఁగనునేను,
ఎన్నినాళ్లయ్యెనో యెఱుఁగలేనైతి.
ఎదపైనిజేవైచి, నిదురపోయితిని.

* * * * *

* * * * *

* * * * *

కలవచ్చె మంటలోఁ, గాలుచున్నట్లు,
తెలివివచ్చె, భయంబుగలిగె నెమ్మదిని.
గడగడవడకితిఁ ; గదలలేనైతి.

అటునిటుచూచితి ; అడలుచునుంటి.
కౌఁగింటిలోఁ గాంతుఁకనఁబడదయ్యె ;
పొగడపూఁబొదరిల్లు పోయెనెయ్యెడకో.
పడియుంటి నిసుకఁ బూఁబాన్పనంగాదు.
మట్టమధ్యాహ్నమున, పట్టియెడారిఁ
బట్టబైటను నేను బడియుంటినిసుకఁ;
గాలినయిసుకపైఁ గదలుచునుంటి;
గడగడవడఁకుచుఁ గదలలేకుంటి;
వేఁడిగాలులు మీఁద వీఁచుచునుండె;
ఎండచే నొడలెల్ల మండుచునుండె.

*　　*　　*　　*　　*

*　　*　　*　　*　　*

*　　*　　*　　*　　*

పేర్వెట్టి యింతిని బిలువనెంచితిని;
పేరెఱుంగను, దాని యూరునెఱుంగ;
ఏమనిపిలుచుటో యెఱుఁగకయుంటి,
ఏమనియఱచుటో యెఱుఁగలేనైతి.
"ఇంతిరో" యనిపిల్వనెంచితిఁగాని,
మాటయొక్కటియైన నోటరాదయ్యె.
కాంతనన్నుఁ బరీక్ష కావింపఁబోలుఁ

గాకున్న నీరీతి కఠినత్వమున్న?
కలికిఁజూపులు లేవు కత సెప్పువేళ :
మొలకమాటలు లేవు మురినొప్పువేళ ;
మురివేళ, కతవేళ, నగసాలవేళ,
మొలకగాలే దింపకలికిగాలేవు:
కారణంబేమి యీగాకఠినత్వమునకు?
వచ్చు వైళమువచ్చు, వచ్చి నన్జూచు,
వచ్చు నాకానందమిచ్చును మెచ్చు;
ననుచు నించుక సేపు మనమునందుఁ దలఁచి,
యూరటచెందితి, నువ్విళులూరి—
కాని, వచ్చెదుజాడ కనఁబడదయ్యె,
వచ్చి కన్పడుజాడ పనుపడదయ్యె.

*　　*　　*　　*　　*

నామాట వినువారు, ననుఁజూచువారు,
నామొఱాలించువా రేమూలనెవరుఁ
గనుపట్ట రేమిచేయను దోఁచదయ్యె.
వేఁడినిట్టూర్పులు విడిచెనుబయలు,
ననుఁజూచి జాలిఁజెందినదేమొ బయలు;
మోమున నల్లని ముసుఁగిడె బయలు;
ననుఁజూచి జాలిఁజెందినదేమొ బయలు;

కనులనీ రింతంతఁగార్చెను బయలు,
ననుఁజూచి జాలిఁజెందదదేమొ బయలు;
బయలిజాలినిజూచి, భయమింతతగ్గ.
లేవంగఁజాలితి, లేచి నిల్చుంటి ;
అడుగిడఁజాలితి, నటుపోవుచుంటి,
ఎటుపోవుచుంటినో యెఱుఁగను నేను.
దవ్వుదవ్వుల సముద్రంబు కన్పడియె.
తకతక కెరటాలు తాండవంబాడ—
ఆకాశమంత మేఘావృతంబయ్యె,
అంధకారము కప్పె నన్నిదిక్కులను ;
ప్రళయఝంఝానిలప్రబల వేగమునఁ
దారంగ తాండవధ్వని మిన్నుముట్టె.

* * * * *

ఎటుచూడదిక్కులే దెందు నేఁబోదు !
ఎటువేడదిక్కులే దెందునే నుందు !
ఏమిచేయఁగనౌనొ యెఱుకలేదయ్యె,
ఎట్లునిల్వఁగనౌనొ యెఱుకలేదయ్యె.

* * * * *

క్రమ్మినచీఁకట్లు క్రమ్మినట్లుండె,
కప్పినమేఘాలు కప్పినట్లుండె,

పడుచున్న చినుకులు పడుచునేయుండె,
వీఁచుగాలులతోటి లేచు కెరటాలు
పొంగి మీఁదికిఁ బొర్లి పొర్లి పడుచుండె ;
ననుఁ ముంచి లోనికీడ్చునో తరంగాలు,
ననుఁ ద్రోసి మీఁది కెత్తునో గాలి—

*　　　*　　　*　　　*　　　*

ఏమిచేయఁగ నౌనో యెఱుక లేదయ్యె,
ఏమనుకొన నౌనో యెఱుక లేదయ్యె ;
ఏడుపులోఁ గొంత తృప్తి కన్పట్టె.
మనసారఁగా నేడ్వ మనసు జనించె,
కనువారు వినువారు కనరానికతన,
అఱచితి గట్టిగా నఱచుచునుంటి.

*　　　*　　　*　　　*　　　*

గాలితోఁ బోయి, మేఘాలతోఁ గలసి,
కెరటాలతోఁ బోయి, యురులతోఁ గలసి,
నిట్టూర్పు గాలిలో నిండఁగాఁ జేసి,
కన్నీళ్లు కెరటాలఁ గలయఁగాఁ జేసి,
యేడ్చెద మనసార నేడ్చుచుండెదను.
కెరటాల తుంపురుల్ కెలనికి వచ్చి,
కారుచీఁకటి వచ్చి చేరువ నిల్చి,

## విరిసెజ్జ

మేఘాలచినుకులు మేనిపైఁ జరచి,
ననుఁబరామర్శింప * * * *
* * * * *

వలదు వెన్నెలనాకు, వలదుచుక్కలును,
వేగుఁజుక్కనుజూచు వేళయువలదు ;
ఇరులతోఁ దరగతుంపురులతోఁ గలసి,
మొరయుచిన్కులఁగూడి మొఱపెట్టుకొంచు,
ఏడ్చెద—ఏడ్చెద—ఏడ్చుచుండెదను.
చీఁకటినెయ్యుండు చెంతఁ గూర్చుండి
ముచ్చటలాడుచు మురియుచునుండ,
వలిగాలిచుట్టంబు చెలిమితోవచ్చి,
యరలేనికూరిమి నరయుచునిలువఁ
గారుమబ్బుపడంతి కన్నీరునించి
జాలిగొల్పుచుఁ జేరి సందిటనిముడ
మన్నుమిన్నేకమై మలయుచందాన
దుఃఖంబు లోనుండి దుముకుచునుండ,
నిచ్చకువచ్చిన ట్లేడ్చుకొంటాను.—
ఓదార్చువారు లేకున్నకతాన,
ఏడ్చినమాత్రనే తృప్తినిగంటి—
ఓదార్పు నాకేల, యోర్పునాకేల,

వెన్నెలనా కేల, వెలుగునా కేల
నా కేలతారలు, నా కేలతరణి,
చెలికాఁడుచీఁకటి చెదరిచూడంగ
వలిగాలిచుట్టంబు కలఁగిచూడంగ,
మబ్బుతోఁ గాలంపుమల యెక్కుతాను,
కాలంపువెల్లువఁ గలసి—పోతాను, *
కాలమై కాలానఁగలసిపోతాను.
గాలి—చీఁకటి—మబ్బు—

*　　*　　*　　*　　*

*　　*　　*　　*　　*

*　　*　　*　　*　　*

ఎదుటనున్న సముద్రు నీక్షించుచుంటి ;
గాలివానకుఁ జిక్కి కనువారులేక,
ననుఁబోలె నేడ్చుచున్నవితానఁ దోఁచె.
ఏడ్చువారినిగూడి యేడ్చెడువారు
కనఁబట్టఁ గలుగదే మనసుకుఁదృప్తి ?—
ఇరువురమైతిమి—ఏను, సంద్రంబు—
ఆసముద్రంబుతో నంటి నీరీతి:
"మొదలుతుదయునులేక, మొనసిచీఁకట్లు
నిన్నుఁగప్పెసంద్రమా, ననుఁబోలెనిపుడు :

పొంగి, పైకుబుకుచుఁ బొర్లుచువచ్చి,
దుఃఖంపుఁగెరటాలు తూలుచునుండ,
నిట్టూర్పుగాలులు నిగుడఁజేయుచును,
ననుఁబోలె నేడ్చుచున్నావొకో నీవు ?
చూడఁజుట్టములేక స్రుక్కుచునుండి,
మ్రొక్కదైవములేక మొరయుచునిలిచి,
కనువారు, వినువారు కనుపట్టకుండ,
ననుఁబోలె నొంటినున్నావె యీవేళ ?
ఇదియె మేలిదియె మేలిదె మేలుసుమ్మ,
మనసారఁగానేడ్చి తనివొందనగును.
నిన్ను నేనును, నన్ను నీవు నోదార్చు
కొనుచుఁ గాలముఁద్రోసికొనుచు నుందాము.
సంద్రంబు ననుఁజూచి జాలిని జెందె,
సంద్రంబుఁ జూచి నేజాలిఁ జెందితిని.
ననుఁగౌఁగిలింపసంద్రంబు తలంచె,
నేనుసంద్రముఁ గౌఁగిలింప నెంచితిని.
వెలిగాలివాన, లోపలిగాలివాన,
యొక్కరీతిగఁగ్రమ్మి యొనరించె భయము.
వార్ధితో నీరీతిఁ బలికితిమరల—
గాలిమెండయ్యె, మేఘాలునిండయ్యె,

వాన తొండాలతోఁ బైఁబడుచుండె.
నీకు శక్యముకాదు నాకడనిలువ,
నాకు శక్యముకాదు నీకడనిలువ ;
నీవు నాలోఁజొచ్చి నిలువవచ్చెదవో,
నేను నీలోఁజొచ్చి నిలువవచ్చెదనో,
................................వద్దు,
* * * నీవు నాలోనఁ గలయఁగావద్దు—
నీవు నాయెదలోన నిలువఁగాలేవు ;
కన్నీళ్లరూపానఁగరఁగి, యుప్పొంగి,
పాటుతోఁ బోటుతోఁ బైకివస్తావు.
వ్యర్థమే యదిసుమ్ము, వ్యర్థమే నిజము.
నేను నీలోఁజొచ్చి నిలువఁగల్గెదను.
నీకసాధ్యము నన్నుఁ బైకిఁద్రోయంగ.
నేను నీలోఁజొచ్చి నిలువ, నిద్దఱము
దివ్యస్వరూపాలఁ దేజరిల్లెదము.
ప్రళయమయ్యదియౌను—ప్రళయమే—యౌను.
ప్రళయాన యోగనిద్రను దేలియాడి
నీయందునిల్చు నారాయణునట్లు
నేనునీలోనిల్వ, నీకునునాకు
నన్యోన్యవైభవం బమరునుఁజుమ్మీ."

సంద్రంబునాపైని జాలిని జెందె,
తరంగలచేతుల బిరబిరంబిలిచెం *
దరంగలచేతుల బిరబిరంజాపె.
* * * * *
ఆశయంతయునింకె, నడలుజనించె,
* * * * *
దరిదాపుగనరాదు, తడవేలనింక,
ఇదిగో నీలోంజొత్తు నేను, ననుగొనుము.''
పిలుచు మున్నీటిని బలుకరించితిని.
రాలుకన్నీటం దర్పణములిచ్చితిని.
మున్నీటికౌంగింట మునంగంజొచ్చితిని.
కన్నీటికాలువల్ శార్పంజొచ్చితిని.
మున్నీరుజాలిచే నన్నాదరించె,
కన్నీరుజాలిచే మున్నీటంబెంచె ;
కన్నీరు మున్నీరు నన్నావరించె,
కన్నీరు మున్నీటికౌంగిటంజేర్చె.
మున్నీటికౌంగింట మునంగుచునుంటి,
తరగచేసాపి సంద్రము నన్నుంబట్టె.
ననుంబట్టిమీంది కెత్తెను సముద్రంబు.
మింటందళుక్కను మెఱపొందు మెఱసె.

## విరిసెజ్జ

తరగచేతుల సముద్రము నన్నుఁబట్టి
యొడ్డుకువిసరినయొప్పు కన్పట్టె.
విసరిననను బట్టి విసవిసనెవరో
కౌఁగింటఁబెట్టినకరణిఁగన్పట్టె.
విరిసెను మేఘాలు, వెలిసెను వాన,
వెన్నెల యంతటవిలసిల్లుచుండె ;
చిఱుగాలిలాస్యంబు సేయుచునుండె,
కెరటాలునృత్యంబు జరిపించుచుండె,
ఇసుకతిన్నియపైని నింతికౌఁగింటఁ
గూర్చుంటి—చిత్తంబుకుదుటనుబడియె.
స్పర్శలోవింతకన్పట్టుచునుండె,
వెనుకకుఁదిరిగి మోమును గనుఁగొంటి—
కాని, మోమునువంచి కాంచితిసిగ్గు.
పొగడపూఁబొదరింటి పొలఁతికాదదియు,
వెన్నెలలోఁగాంత వింతగాఁదోఁచె.
ప్రాఁతవింతలు క్రొత్తరీతిఁబెంపారె.
కౌఁగింటిలో ముద్దు కనఁబడుచుండె.
చూపులలో ముద్దు సాగయుచునుండె.
గడగడవడకితిఁ గాంచితిసిగ్గు,
గడగడలాడితిఁ గంటినిభయము.

కౌఁగిలితప్పించి, కాంతపాదములు
పట్టితి,—పట్టితి—పట్టితిమరల.
అపరాధి నపరాధి నపరాధి నైతి
అపరాధినైతి నన్నాదరింపకుము.—
కన్నీటఁ బాదాలు కడుగుచునుంటి,
అపరాధి నపరాధి నపరాధినంటి.
ఆత్మేశ్వరీ నీకు నపరాధినైతి ;
నీప్రేమ గుర్తింపనేరక యుంటి,
నీమహాత్త్వ మెఱుంగనేరక యుంటి.
బైటిరంగులకు నే భ్రమలఁ జెందితిని,
బైటితీపులకు నబ్బంబు నందితిని,
నీముద్దు నీసుద్దు నేమరిపోతి,
నిన్ను నేమరచితి, నినుజూడకుంటి,
తలపకయుంటి డెందమునందు నిన్ను
నీకొగ్గుచేసితి, నీచుండ నేను.
నీపాదసేవను నేఁదగనింక,
నీయింటిబంటనై నేనిల్చునట్లు,
నీసేవకులసేవ నేఁజేయునట్లు,
వరమిమ్ము, నాతప్పు లరయకుమింక,
నీదుపాదములంటఁగాదు నాకింక;

చేసితిపాపంబు; చేసెదసేవ;
నీసేవకులసేవచేసి పాపంబు
తొలఁగించుకొందు నన్ద్రోసిపుచ్చకుము.

* * * * *

తలవంచి చేమోడ్చినిలిచితి నెదాట,
కన్నీటఁ బాదాలు కడుగుచునుంటి;
చేసాపి కౌఁగింటఁ జేర్చనన్గాంక;
కాంతకౌఁగిట నన్ను గదియించినిల్చె.
ఏలవిచారింతు విట్లుప్రాణేశ,
వంతనీకేటికి వలదింకవినుము.
ననునీవు విడనాడియునికి నిజమ్ము,
నినునేను విడనాడియునికి లేదెపుడు.
నినుఁగనిపెట్టుకొంటిని, వెంటనంటి
నినువిడనాడక, నీమ్రోలనుంటి;
నీకష్టములనేను నిలిచికంచుంటి
నీమొఱలన్నియు నిల్చివించుంటి,
నీతోడఁ బలుకాడ నేరకయుంటి,
నీకుఁ గన్పట్టఁగా నేరకయుంటి,
కాని నీవెనువెంట నేనంటియుంటి.
అకట, పశ్చాత్తాపమైనయందాక

నీతోడఁ బలుకాడ నేర్పు లేదయ్యె,
నీకుఁ గన్పట్టఁగా నేర్పు లేదయ్యె.
కాలంబె కలయంగఁ గారణంబౌను,
కాలంబె విడిపోవఁ గారణమౌను.
కాలంబె విడఁజేసె; కాలంబె కలిపె;
వగపేలఁ గాలంపుఁబనికి నీకిప్డు!
నిన్నుఁ గాపాడంగ నే వేచియుంటి,
నిన్ను మన్నింపంగ నేఁగోరియుంటి,
నీపైని గూరిమి నిండారు నాకు,
నిండారు ప్రేమతో నే నిన్నుఁ జూతు
నేనె నీవనుకొమ్ము నీవె నేననుము
ఏనును నీవొక్కటే యనుకొనుము.
నీవు నా కౌఁగింట నిలువుమీ వేళ,
నిన్ను నేనరయుచు నిలుతు నే వేళ."
అనుచు నీరీతి నన్ననునయించుచును,
చేయిచేఁబట్టుచుఁ జిఱునవ్వు నగుచు,
నింటికిఁ గొనిపోయి యింపుగావించె.
ఇంటిపట్టుకుఁ బోయి, యింపునం బొదలి
యాత్మేశ్వరిం గూడి హాయిఁ జెందితిని.

* * * * *

నడుమవచ్చినగొప్ప నడుమనేపోయె
నాత్మేశ్వరినిగొల్చుటది నాకుమిగిలె,
ఆత్మేశ్వరినిగొల్చి యలరుచునుంటి,
ఆనందమునఁ దేలియాడుచునుంటి.

*     *     *     *     *

ఆనందమునఁ దేలియాడుచునుంటి,
నాత్మేశ్వరింగొల్చి యంతంబులేని
యానందవార్ధి మున్గాడుచునుంటి;
ముద్దుజూపులతోడ ముచ్చటల్గొల్చి,
ముద్దుమాటలతోడ మురిపెముల్గొల్చి
ముద్దులమూటయై మ్రోలనిల్చుచును,
ముద్దులసుద్దుల మోహంబుగొల్చి,
యల్లారుముద్దుగా నరయుచునున్న
యాత్మేశ్వరింగొల్చి, యంతంబులేని
యానందవార్ధి మున్గాడుచునుంటి,
నానందమునఁ దేలియాడుచునుంటి.

*     *     *     *     *

*     *     *     *     *

*     *     *     *     *

---

